# ధూమపానము

(పద్యకావ్యము)






గ్రంథకర్త :

మధురకవి

పిడపర్తి ఎజ్రా

తెనాలి.

# DHUMA PANAMU

(TELUGU POETRY)



Author :
**Madhurakavi - PIDAPARTHY EZRA**
Native - PIDAPARRU.

547/RCF

Residence :
**BOSU NAGAR - T E N A L I.**
**GUNTUR (Dt.)**
Andhra Pradesh.

Copy Rights.)

(PRICE : 6.00

# పరిచయము

పిడపర్తి ఎఱ్ఱాగారు కొల్లిపర మండలములోని పి
వాసి, శ్రీమతి పున్నమ్మ-జక్రయ్య దంపతుల జ్యేష్ఠపుత్రుడు.
ఉపాధ్యాయవృత్తి నలంకరించినారు. బాలబాలికల నెందరి
మంచిపేరు గడించారు. వీరిని ఉపాధ్యాయునిగాను, "కవి
నెరుగుదును. వారు నాతోకలసి పలు సాహితీ సభలలో
లందుకొన్నారు పంచివక్తి. ఇనుపదియైదు కావ్యములకు పైచి
చేనారు ఇందు సాంఘిక, పౌరాణిక నాటకములు కలవ
చదువువలన, సాధనమువలన రాదు. పుట్టుకతో రావలెన
"ధూమపానము". ధూమపానము అనగా పొగత్రాగుట.
బీడీ, సిగరెట్, గంజాయి మున్నగునవి. పొగత్రాగుట
హానికరము, దురలవాట్లలో యిది యొకటి. ప్రజల శ్రేయస్సు
వలన కలుగు కష్ట-నష్టములను పరిపూర్ణముగా స్పష్టపరచినా
పద్యములు వ్రాసినారు. "ఆటవెలది" యన్న ఆనందపడని
డడు. ఆటవెలది "వేమన్న" గారిసొత్తు. ఎఱ్ఱాకవిగారు "ఆట
ఆటాడించినారు. ఇక్కవి కవితాధార సెలయేరువలె సాగిపోవ
ముగాను, లలితముగాను, సరళముగాను వీరి కవితలు ప్రజా
నాలుకలపై నివసించును. సీసములకు మీసలు ధీటగల మొ
సీసములు, అనర్గళమై, ఎదుటివారి హృదయముల నాకట్టుక
కవితా పరిశ్రమలో పరహస్తమునకు చోటుండదు ఇది యా
కారణము. సాంఘిక దురాచారముల నెత్తిచూపుటలో నిష్ణాతు
ఖండించగల గుండె తెంపుగలవాడు. వీరి భావనా పటిమ ప్ర
ప్రతి పద్యము మాధుర్యముగ నుండును. కావుననే వీరికి "
అను బిరుదము గలదు. వీరు ముమ్ముందు మంచి మంచి కావ
ప్రజాశ్రేయస్సుకై పాటుపడవలయుననియూ, "కవికోకిల"
కళారంగమున అత్యున్నతముగా, గానము చేయగలరని
ఆనందించుచున్నాను. "కవికుమార" "కవిశేఖ

కొలకలూరి గోప

# ముందుమాట

"మధురకవి" శ్రీ పిడపర్తి ఎఱ్ఱాకవిగారు ధూమపానంవల్ల కలిగే దుష్ఫలితాలను గురించి సామాన్య పాఠకులకు కూడా అర్థమయ్యే శైలిలో "ఆటవెలది" పద్యాలలో చక్కగా వివరించారు ఇటీవల తెలుగు మహిళా మణులు ప్రారంభించి విజయవంతం చేసిన "మద్యపాన వ్యతిరేక ఉద్యమం" లాగానే "ధూమపాన వ్యతిరేక ఉద్యమం" ప్రారంభించ వలసిన అవశ్యకత ఎంతో ఉన్నది.

"పశువు ముట్టనట్టి పాడు పొగాకును రెండుకాళ్ళ పశువు దండుకొనును. దానిరుచిని మరుగు దారిద్ర్యులిమ్మహిన్ ప్రాణమిచ్చుచుండె పణముగాను"

ఈ విధంగా పొగత్రాగే వ్యసనపరులను హెచ్చరిస్తున్నారు ఎఱ్ఱాకవి "దమ్ము కొట్టువాని రొమ్ములే కాకుండ, ఇంటిలోని వారికెంతొ కీడు ఒకని వలన కలుష మూరంతప్రాకుచు మట్టుబెట్టుచుండె మానవులను" అంటారు పొగత్రాగేవారు వదిలే పొగ కాలుష్యంవల్ల (Passive Smoking) ఇంటిలోని వారికి, సమాజానికికూడ చేటు అని వైద్యులుచేసే హెచ్చరికను కవిగారు బాగా గుర్తుచేశారు. "గుట్టునెఱిగినట్టి గొప్ప డాక్టరుకూడ మాన లేడు దాన్ని మాన్పలేడు" అనేది యదార్థం. కొంతమంది వైద్యులు, తామే పొగత్రాగుతూ రోగులను త్రాగవద్దని ఎలా శాసించగలుగుతారు?

బాల్య, విద్యార్థి దశల్లో ఆసక్తితో ప్రారంభించి చివరకు ధూమ పానానికి విపరీతంగా అలవాటుపడి అనేక వ్యాధులకు గురి అవుతున్న మానవులను కవిగారు మేలుకొలుపుతున్నారు. ఆ అలవాటును మాను కొమ్మని ప్రాధేయపడుతున్నారు. ఎక్కడపడితే అక్కడ ఉమ్మివేసి వాతా వరణాన్ని, వీధులను కలుషితంచేసి తోటి మానవులకు వ్యాధిని వ్యాపింప చేయవద్దని కవి బ్రతిమాలుతున్నారు విద్యాసంస్థలలోను, ఆస్పత్రులలోను ఆఫీసులలోను, బస్సులలోను, రైళ్ళలోను ఇతర ప్రజాసమూహములలోను పొగత్రాగటం నిషేధించాలని కవి ఆకాంక్షిస్తున్నారు.

విపరీతంగా పొగత్రాగేవారిలో ఊపిరితిత్తుల కేన్సరు, "క్రానిక్ బ్రాంకైటిస్" "క్షయ" మొదలైన ఊపిరితిత్తుల వ్యాధులు, గుండెపోటు,

అంజైనా మొదలైన గుండెజబ్బులు, కొంతదూరం నడవగానే కాళ్ళ
నొప్పివచ్చే "బ్యుర్జర్స్ డిసీజ్" అనే వ్యాధి, పొట్టలో మంట, నొ
మొదలైన లక్షణాలు ఉంటే "పెప్టిక్ అల్సర్" అనే వ్యాధి ఇంకా అ
వ్యాధులు ఎక్కువగా వస్తాయి.

పొగత్రాగటం ఎంత హానికరమో, పొగాకు నమలటం, పొ
పీల్చటంకూడా అంతే హానికరం. సిగరెట్లు, బీడీలు, చుట్ట అన్నీ ప్రమ
హేతువులే. పొగాకు నమలటంవల్ల నోటికి కేన్సర్ వచ్చే అవకాశం ఉన
పొగత్రాగటం పూర్తిగా మానివేయటంవల్ల పైన చెప్పిన వ్యాధులన్నీ త
ముఖం పడతాయి.

మద్యం సేవించడంవల్ల ఎన్ని అనర్థాలు ఉన్నవో అంతకం
ఎక్కువగా తన శరీరానికి, తనప్రక్కన ఉన్నవారికీ కూడా హానికలిగి
ఈ ధూమపాన పిశాచిని పారద్రోలాలంటే ప్రజలు, ప్రభుత్వంకు
ఎంతో కృషిచేయాలి ఈ దురలవాటును మాన్పించుటకు పుస్తకాలద్వా
పత్రికలు, రేడియో, దూరదర్శిని వంటి ప్రచార సాధనాలద్వారా ప్రజల
ప్రచారం చేయాలి. మధురకవి శ్రీ పిడపర్తి ఎఱ్ఱాకవిగారి ఈ పుస
ధూమపాన వ్యతిరేక ఉద్యమానికి ఎంతో దోహదం చేస్తుంది ఈ దు
వాటు ప్రజల్లో వ్యాపిస్తున్నందుకు కలుగుతున్న ఆవేదన వారి ప్రతి పద్యం
ప్రతిబింబిస్తూ ఉన్నది.

ఒక ఉత్తమ ఆశయంకోసం సులభగ్రాహ్యమైన పద్యాలరూపం
రమణీయంగాను, ఆలోచనా ప్రేరకంగాను వ్రాసిన శ్రీ ఎఱ్ఱాకవి అభిన
నీయులు "నవయుగ కవిచక్రవర్తి" శ్రీ జాషువా, "కరుణ శ్రీ
శ్రీ జంధ్యాల, "తెలుగు లెంక" శ్రీ తుమ్మల కవి పుంగవుల కవితల
వలెనే శ్రీ ఎఱ్ఱాకవి రచనలలో కూడా తీయని తెలుగుదనం, దీనుల
కరుణ, అన్యాయంపట్ల ఆవేదన, సాత్విక స్వభావం, జాతీయత
విరిస్తున్నవి.

ఈ పుస్తకానికి "ముందుమాట" వ్రాసే అవకాశాన్ని న
కలిగించినందుకు శ్రీ ఎఱ్ఱాకవిగారికి నా కృతజ్ఞతలు.

తెనాలి — డా॥ పి. దక్షిణామూర్తి MDFICA

9—7—93 — Physician

# దైవానుగ్రహము

ఆయన అనుగ్రహమే లేకపోతే నేనీ కావ్యాన్ని మీ ముందుంచ గలిగేవాడను కాను. ది 12-2-93 ఉషోదయాన ముందుకుపడి కప్పు కూలి పోగా బిడ్డలు టాక్సీమీద గుంటూరుచేర్చి డా॥ వి. భాస్కరరావుగారు, హౌస్ సర్జను జి. దేవరాజుగారి ద్వారా పునర్జన్మ యిప్పించారు. అందు వలన చల్లగా కోలుకొని అంతకుముందే వ్రాసి ఉంచిన ఈ కావ్యాన్ని మా సోదరుని కుమారుని అచ్చు వేయించమని కోరగా వారి ఔదార్యముచేత కావ్యము ముద్రణకు నోచుకొన్నది.

మా కుమారుడు రమేష్‌బాబు M. A., B. Ed., B. L. వగైరా బిరుదులు ఎన్నో పొంది జాబు చేయుచున్నారు. నిష్కళంక చిత్తుడు, ఆర్ద్ర హృదయుడు, పరోపకారి. అట్టి యోగ్యుని ఆర్థిక సాయముతో కావ్యము వారి తల్లిపేర రూపుదిద్దుకొన్నది. వారికి నేనెంతో కృతజ్ఞుడను.

కావ్యము అచ్చయిన పిదప శ్రీ కొలకలూరి గోపకవిగారిని అభి ప్రాయము వ్రాసియిమ్మని కోరగా వారు ప్రేమతో అంగీకరించి దానిని ఆమూలాగ్రంగా చదివి వారి అభిప్రాయము వ్రాసియిచ్చారు. మేము ఏకోదర రులవలే సాగిపోవుచున్నాము. సాహిత్యాభిలాషి చాలా కావ్యాలు వ్రాశారు. కవనములో అందెవేసిన చేయి దానికి మచ్చుతునక ఏకలవ్య చరిత్ర ధూమపానము మొదలగు దురలవాట్లకు దూరస్థుడు, కవులను ప్రోత్సహించి సత్కరించుటలో దిట్ట. అట్టి యోగ్యుడు దొరకుట నా అదృష్టము. వారికి నా కృతజ్ఞతలు.

కావ్యము వ్రాసిన వెంటనే డా॥ కొత్త రవీంద్రబాబుగారికిచ్చి అభి ప్రాయము వ్రాసిమ్మని కోరగా అచ్చయ్యేటప్పుడు వ్రాస్తానని కావ్యాన్ని

మెచ్చుకుని తిరిగి యిచ్చారు. అచ్చయిన పిదప వెళ్ళగా గ్రామాంతరి వెళ్ళారని తెలిసి 10 రోజులు ఆగాను. కాని వారు రాలేదు. వారి పరిచ వాక్కులు దక్కలేదు.

హృద్రోగ నిపుణులు, విశాలభావ సంపన్నులు ఎందరికో పునర్జ లిస్తూ సేవచేస్తున్నారు. నా కావ్యమునకు అభిప్రాయము వ్రాసియిమ్మ బెదురుతూనే డా॥ దక్షిణామూర్తి దగ్గరకు వెళ్ళాను. ఎందుకంటే తీరు ఉండదు. ఇసుక వేస్తే రాలని జనము. అయినా మా విద్యార్థి ద్వారా వెళ్ళ ప్రవేశము దొరికినది. అంత రద్దీలోకూడా ఆ సాహిత్యాలాపె మన అంతాయింతాకాదు. వారి ప్రేమ చూడండి.

ఆ॥ గుండెజబ్బు లెన్నొ కూకటి వ్రేళ్ళతో
కూల్చివేయుచున్న గొప్ప వెజ్జు
దయను బరపి మెలగు దక్షిణామూర్తికి
ప్రణతులిడుదు నేను భక్తితోడ.

సరే నాలుగురోజులు గడువుపెట్టారు. మహానందముతో కావ్య వారిచేతిలో పెట్టి తిరిగి వచ్చాను. గడువుకి వెళ్ళాను. అభిప్రాయము వ్ర మా విద్యార్థికే యిచ్చి నాకొరకు వేచి యుంచారు. నన్ను కలవగానే పై తీసుకొని వెళ్ళితే ఆ మహాప్రభువు అర్ధనూట పదహారులు చేతిలో ఉం కొని నాకు యివ్వజూపారు. అయ్యో! ఇంత ఉపకారివద్ద నేను పుచ్చు కోవడము ధర్మముకాదని వద్దని మనవి చేశాను. కాని వారు వానిని జేబులో కుక్కారు.

ఆ॥ అర్ధ నూరులిచ్చి అత్యంత ప్రేమతో
ఆదరించినట్టి వేదమూర్తి
పొంగిపోయె మనసు పూజ్యుని ప్రేమకై
మరువగలన యిట్టి మాన్యు'లను

ఇంకా ఉన్నారు. లంకరెడ్డి సుబ్బారెడ్డిగారు, తాళ్ళూరి కృష్ణమోహ దాసుగారు మొదలగువారు. వారు దీనికి దూరముగా ఉండి 60 సం॥ ద జీవిస్తున్నారు. అలాగే సోదరులందరు వారిని ఆదర్శప్రాయంగా తీసికొ పెక్కేండ్లు జీవించాలని నా ఆకాంక్ష జైహింద్.

12—7—93
తెనాలి



గ్రంథకర్త.

# తప్పొప్పులు

| సీ. నెం. | పేజీ | పద్యము | వరుస | ఒప్పు |
|---|---|---|---|---|
| 1. | 7 | 3 | 2 | ఎఱింగి |
| 2. | 16 | 3 | 2 | దుస్తరంబు |
| 3. | 26 | 2 | 3 | గూడి |
| 4. | 30 | 3 | 3 | ఏమఱిచి |

# ధూమపానము

I కత్తి చేతబట్టి కనలి వచ్చెడి రౌడి
బాహుబలము జూడ భయములేదు
చుట్ట నోటబెట్టి చురుకుగాపొగబీల్చు
భరత సుతిని జూడ భయము నాకు

II పొగరుబోతు పొగను పూర్తిగా నరికట్ట
వ్రాసినాడ దీని ప్రజలకొఱకు
దీనిలోని తప్పు తేటగా గ్రహియించి
కాలరాయుగాను కదలిరండి

III ప్రజల ప్రాణములను పాశవికంబుగ
మట్టుబెట్టునట్టి మత్తుమందు
తెలివి గలిగి దీని తెగటార్చకున్నను
సుఖము దక్కబోదు నిఖిలమందు

IIII కవులెగాదు గాయకామణులైన
పొగను ముట్టనట్టి పూజ్యులెవరు?
అందువలన వారలంతగా దానిని
ఎత్తి చూపలేదు మిత్తియనియు

ఆ॥ పశువు ముట్టనట్టి పొడు పొగాకును
రెండుకాళ్ళ పశువు దండుకొనును
దాని రుచిని మరుగు దారిద్ర్యులిమ్మపి
ప్రాణమిచ్చు చుండె ఫణముగాను

ఆ॥ గుండెపోటు పెరుగనిండు ప్రాణాలను
బలిగ నిచ్చుచుండె పామరుండు
పొగను పీల్చుకుండ పూట గడువలేదు
ఎంత చిత్రమిట్టి వింతబ్రతుకు

ఆ॥ ఉధృతముగ పీల్చ ఊపిరితుత్తుల
లోన నిలిచిమిగుల హానిగూర్చు
విషయ మెరిగినట్టి విజ్ఞానులైనను
నిత్యమిట్లు త్రాగి నీల్గుచుండె

ఆ॥ గుండె కుహరమంత నిండుగా పొగచూరి
శిధిలమైన పిదప చింతపడిన
తిరిగి కోలుకొనుట జరుగనిపని గాన
దీపముండగానె దిద్దుకొనుము

ఆ॥ చింతగూర్చునట్టి సిగరెట్టు ముక్కను
మరచి నిదురబోరు మరిగిదాని
వలపుకత్తె కన్నవయ్యారి కన్నను
మిన్నగాను నుండె మేధి నిద్ధి

ఆ॥ సగము జీవితంబు సిగరెట్టు కోసము
బలిగ నిచ్చునట్టి పాడుజాతి
కడుపు నిండబోదు కసిరి త్రాగినగాని
సిగ్గులేని పనికి చింతపడరు

ఆ॥ చుట్ట బీడి తమ్మ షోకైన సిగరెట్టు
మనుజ జాతినెల్ల మట్టుబెట్టు
పొంచియుండ మిత్తినెంచరు కీడును
దాని మర్మమేమొ దైవమెరుగు

ఆ॥ దమ్ముకొట్టువాని రొమ్ములే కాకుండ
ఇంటిలోని వారికెంతొ కీడు
ఒకనివలన కలుష మూరంత ప్రాకుచు
మట్టుబెట్టుచుండె మానవులను

ఆ॥ కామశక్తికన్న ధూమపానముశక్తి
మించిపోయె నేడు మిక్కుటముగ
ఒంట బుట్టినట్టి ఉత్తమ రుచికన్న
ధూమపాన రుచులు దొడ్డవాయె

ఆ॥ ఆకలాపి మనల నాదరించుట కల్ల
వ్యయము కలుగజేయు వస్తువిద్ది
కాని దానికిట్లు కనిపెట్టి మననేల?
మానుకొనుట మేలు మానవుండ!

ఆ॥ చుట్ట వాసననిన గిట్టని తనవారు
ఏవగించుకొనును ఎంతగానొ!
గిట్టనట్టిదాని ముట్టి ఫలితమేమి?
బ్రతుకు క్రుంగదీసి బాధపడకు

ఆ॥ గొప్పవారి నెత్తి కొప్పులమీదను
గూడు కట్టుకొనిన కులటయిద్ది
నమ్మకముగ నేడు నరులను హతమార్చ
తేనె బూసినట్టి సానకత్తి

ఆ॥ సగము కాల్చినట్టి సన్యాసి చుట్టను
పళ్ళమధ్య నునిచి భద్రపరచి
కోరికి ఉమియు చుండ బెరుకేమి లేకుండ
పొంచియున్న కీడు పోలతి గనక

ఆ॥ లబ్ధిలేని పనికి డాక్టర్లు యాక్టర్లు
తెలిసికూడ వారు తిరుగబడరు
కట్టు బానిసలుగ కాలము వ్యయపర్చ
అబ్బురంబు గొలుపు నమితముగను

ఆ॥ లివరు దెబ్బతినిన నవనిలో బ్రతుకుట
దుర్లభంబు చూడ దుఃఖకరము
గుండెలాగి ప్రజలు కోటానుకోట్లుగ
గాలిలోన గలిసి క్రాలుచుండె

ఆ॥ ధూమపాన ప్రియులు దుర్గతి చెందినన్
ప్రక్కవారలైన లెక్కగొనరు
పీకెమీద కత్తిపెట్టి చెప్పినగాని
వినరు మంచినెవరు వింతయేమొ

ఆ॥ మేలి వలిపములను మేనున ధరియించి
చుట్ట నోటబెట్టి చోద్యమొంద
పొగను పీల్చివదలు వెగటు లేకుండగన్
త్రాగనట్టి వారి దాపుజేరి

ఆ॥ సూటు బూటు దాల్చి షోకైన దొరలెల్ల
చుట్ట కాల్చుచుండు చోద్యమొంద
దానిలోనయున్న దారిద్ర్య రుచియేమొ
అంతుబట్టకుండె నబ్బురంబు

ఆ॥ ధనిక నిర్ధనికను తారతమ్యము లేదు
ధూమపాన మొక్క దొడ్డ జెడద
మరులు కొల్పునట్టి మర్మంబు గలదేమొ
వదలలేడు దాని వలపునుండి

ఆ॥ మగువలు మగవారు మానక సేవించు
దాని రుచిని మరిగి ధరణియందు
మొదట త్రాగవెరచి తుదకది వ్యసనమై
కొంపలార్పుచుండె గోడు జెంద

ఆ॥ అన్నమైన మాని ఆరుపూటలు గడుపు
పొగను మాని ఒక్క పూటయైన
గడుపలేడు దాని గడుసరితనమేమొ
ఎంత చిత్రమిద్ది ఎంతవింత?

ఆ॥ పొలకుండు చెడుగు పలుమారు చెప్పినన్
మనసు నిలిపి దాని మానలేరు
చావుకైన మిగుల సాహసించునుగాని
మాని నిదురబోవ మనసురాదు

ఆ॥ గుట్టు నెఱిగినట్టి గొప్ప డాక్టరుకూడ
మానలేడు దాని మాన్పలేడు
దాని చెడునెఱిగి మానడు వానిసై
పామరుండెగాదు పండితుండు

ఆ॥ మేక ముట్టనట్టి పొడూ పొగాకును
ఎట్టి పశువుకూడ ముట్టబోదు
రెండుకాళ్ళ పశువు లెండుటాకునుజేసి
గావుకొనును దాని కరువుదీర

ఆ॥ పాల నద్దుకొనెడి మేలి బాటలలోన
చుట్ట త్రాగువారు శుద్ధి విడిచి
కలుషమైన యుమ్మి కాండ్రించి యుమియుచు
రోతచేయుచుండు రోడ్డునంత

ఆ॥ కుంటి చెవిటిగాని గ్రుడ్డివారలుగాని
త్రాగనేర్చుకొనిన దమ్ము నింక
విడువలేడు దాని విడిచి బ్రతుకలేడు
దానికున్న ధూర్తతనము వలన

ఆ॥ చిన్న పెద్ద యనెడి శేషంబు లేకుండ
దాని మోహమందు తగులుకొనిన
విడువలేడు దాని గడుసరితనమేమొ
పీల్చి పిప్పిజేయు పీకెనులిమి

ఆ॥ ఒక్కసారి దాని ప్రక్కజేరినచాలు
మత్తుజల్లి వాని మనసుమార్చు
సానికూడ నిట్లు సాహసించుట కల్ల
దాని మర్మమరయ తరముగాదు

ఆ॥ బక్కచిక్కిపోయి బ్రతుకు నీడ్చెడివాడు
బలము ఉడిగికూడ తెలివిమాలి
వెచ్చబెట్టు కొంత వెఱ్ఱిపనికి
చావుకోరి యతడు సాహసించి

ఆ॥ గాలిగంతలేని కటికి చీకటియింట
పొగనుపీల్చి వదలు బుద్ధిలేక
పాపమెఱుగనట్టి పసిగందులెల్లరు
మునిగితేలవలెను మురికియింట

ఆ॥ భర్తననుసరించి భార్యయు పొగత్రాగ
చెప్పలేము వారి తిప్పలింక
స్వచ్ఛమైన గాలి వచ్చినా దక్కదు
పూరిగుడిసెవాసి పూజవలన

ఆ। ఆలుమగలు విడుచునా ధూమకలుషంబు
ఇంటినిండ క్రమ్మి మింటికెగయు
పాలుగారునట్టి పసివారి బ్రతుకులు
బలికి సిద్ధమైన పశువు సమము

ఆ॥ అక్క చెల్లి తమ్ము లమృతతుల్యులు
ఎవ్వరైనగాని నివ్విధమున
బలిగ నిలువవలెను పాపిష్టిపొగలోన
తప్పుకొనుటకింక దారిలేక

ఆ॥ దానివలన వచ్చు దారిద్ర్య మావంత
కానలేక వారు గడుపుచుండు
వ్యసనమెంత చెడుగు పసగల్గి పనిజేయు
మానవాళినెల్ల మాయబుచ్చి

ఆ॥ చుట్టత్రాగి సొల్లు చుట్టుప్రక్కల ఊసి
రోతచేయు టెవ్వొ రోగములకు
దారితీయుగలవు తలపోయునా యట్టి
కష్టనష్టములను కార్మికుండు

ఆ॥ తల్లి దండ్రు లింట తగనట్టి పొగత్రాగ
కన్నబిడ్డలెల్ల కలతపడక
వారుగూడ దాని వరియించి చెడిపోవు
చిన్నతనమునుండి చేరువయ్యి

ఆ॥ విద్య నభ్యసించు విద్యార్థి యొక్కండు
ప్రక్కనున్నవాని బ్రతుకు చెఱచు
ఎఱుగనట్టి వారి కెటులనో నేర్పించి
కీడు కలుగజేయు గోడుచెంద

ఆ॥ దమ్ముకొట్టువాడు దారులన్ని చెఱచు
ఎచటపడితె నచట ఎంగిలుమ్మి
వేసి పాడుజేయు విజ్ఞతలేకుండ
ప్రజల మేలుమరచి భ్రష్టమతిని

ఆ॥ రోగక్రిములు రేగి రోగాలు సృష్టించు
మాటమరచి వారు చేటుగూర్చ
పొగను త్రాగకున్న పుడమిలో రోగాలు
వ్యాప్తిజెందబోవు వాస్తవముగ

ఆ॥ క్షయ మశూచి కండ్లకలకలు కలరాలు
వివిధ జబ్బులన్ని విస్తరించి
వ్యాప్తి జెందుచుండు వసుధయందు మిగుల
మనము చేయునట్టి మడ్డిపనికి

ఆ॥ రోగక్రిములనెల్ల ఈగలే యదబెట్టి
హానిగూర్చుచుండె మానవునకు
చిన్నపెద్దలెల్ల చెడుగును గుర్తించి
మసలుకొనిన భువిని మంచిగలుగు

ఆ॥ పదుగురున్నచోట పలువిధ కాలుష్య
క్రియలునల్పి భువిని కీడుగూర్చు
ధూమపానమనెడి దుష్టరాకాసిని
పారదోలకున్న ఫలములేదు

ఆ॥ పొగను పీల్చువాని పుటలు తిరుగవేయ
గుండె, కిడ్ని, లివరు ఎండిపోయి
పుట్టకురుపు పుట్టి పూర్తిగా వ్యాపించు
మానవాళి బ్రతుకు మంటగలుప

ఆ॥ కూలినాలి డబ్బు కూటికేచాలక
పొట్టగడవనట్టి ముష్టివాడు
సగము దమ్ముకొఱకు సాక్షాత్తువెచ్చించు
దమ్ముపిచ్చివలన తనకు తానె

ఆ॥ కడుపు నిండబోదు కంపునింపుటచేత
దానివలన కలుగు హానిమరచి
తృప్తితీర త్రాగి దినములు దొర్లించు
విధముజూడ మనకు విస్తుగలుగు

ఆ॥ రాజులైనగాని రవణప్పలైనను
ధరణిలోన పెద్ద ధనికులైన
దానిబారినుండి తప్పించుకొనలేరు
దానికున్న బలము తగనిబలము

ఆ॥ మరుగుదొడ్డిలోన మంచి స్థలములందు
కాల్చివేసినట్టి కంపుసరుకు
కంటిముందు చెడ్డ కాలుష్యమైనిల్చి
హానిగూర్చుచుండు నగ్గలముగ

ఆ॥ గౌరవప్రదమైన కార్యాలయములందు
ధూమపానప్రియులు ధూర్తులయ్యు
చిత్రగతినికాల్చు సిగరెట్టు ముక్కలు
నిర్భయంబుగాను నీతిమాలి

ఆ॥ హద్దు మీరిపోయి ఆఫీసులందున
ధూమపాన ప్రియులు దురితమతిని
కాల్చుచుండువాని కాలుష్య మెల్వడ
ఏవగించుకొనక నెంతగానొ:

ఆ॥ చెడుగు తెలిసికూడ సిగరెట్టు కాల్చెడి
భక్తతతికిగూడ భయములేదు
గుండెపోటుగాదు గుండెలే చీల్చినన్
పినరు భయములేదు పెద్దలందు

ఆ॥ ధూమపానమన్న ఏమాత్రమైనను
భయములేదు వారి బ్రతుకునందు
అందరెఱిగినట్టి ఆ మృత్యుకేళిని
కౌగలించుకొనెడి ఘనులువారు

ఆ॥ కంచె చేనుమేసి కానన్లు మెలగ
నీతి ఎటులనిలుచు నేతలార:
ప్రభుత నడుపువారు ప్రధమ ముద్దాయిలై
రూలుమీరి నడుచు వాలుగాను

ఆ॥ ఆకుపసరుగాన ఆ యాకు త్రాగిన
వాంతి కలుగుజేయు నెంతగానొ।
కంపుజూడ మనసు కంపంబుజెందును
ఎట్టివారికైన మొట్టమొదట

ఆ॥ పొగను త్రాగనట్టి పురుషులు వెలదులు
పాలబుగ్గలంటి పాడుచేయు
ముద్దుతీర వారు ముద్దాడబూనిన
తెలిసినట్టివారు తిరుగబడును

ఆ॥ కడుపుకింపుగాదు కంటి కసలుగాదు
దాని రూపులేఖ ధారుణంబు
ఎందువలన మనుజులీరీతి చేరువై
ప్రాణమిచ్చుచుండె భయములేక

ఆ॥ అధిక విలువగలుగు నత్తరుల్ పులిమియు
మేలి వలిపములను మేనిదాల్చి
చుట్ట నోటబెట్టి షోకుగా పొగబీల్చ
వింతకంపువెడలు వీధులందు

ఆ॥ మేకలాగ నమిలి ఆకును మనుజులు
ఊటగార్చుచుండు నున్నతముగ
జిహ్వకెట్టి రుచులు చేకూరునోగాని
పుట్టకురుపు పుట్టి పుట్టిముంచు

ఆ॥ బ్రతికినన్నినాళ్ళు పాడుతమ్మవలన
జిహ్వ బండకెక్కి చేదు, లవణ
రుచుల జాడతెలిసి రోజులు గడుపుట
నమ్మవీలుగాదు తమ్మవలన

ఆ॥ కారముప్పుతెలిసి కడుపార భుజియింప
దుస్త్యజంబు మనకు దుర్లభంబు
ఎవడు దీనిసాకి ఈరీతి పోషించె
విషము వెడలుగ్రక్కు విషపుమొక్క

ఆ॥ ప్రస్ఫుటముగ 'బోర్డు' బస్సులో పెట్టినన్
పొగను వదలుచుండు సెగలుగ్రక్క
"రూలు రైము"లేక రోతగా పొగపీల్చు
విధము జూడగాను వింతగలుగు

ఆ॥ బస్సు రైలు వారి బాబాయి సొమ్మేమొ
సొంతయిల్లువోలె చుట్టకాల్చి
ఉమ్మివేసి పొగతొ ఊదరగొట్టును
మంచిగాలినెల్ల మంటగలుప

ఆ॥ దేశమంత తిరిగి తీరుగా బస్సులో
చుట్టజుట్టి యగ్గిపెట్టెదీసి
తీరుబడిగ దాని తీరిచిదిద్దియు
నోటకుక్కి కాల్చు ధీటుగాను

ఆ॥ వాడు చెడుటగాక ప్రక్కవాని బ్రతుకు
బుగ్గిపాలుజేయు పూర్తిగాను
నల్లమందుకన్న నాభిపాషాణమై
కీడుచేయుగలదు గోడుజెంద

ఆ॥ దీనికంపు నాదుమేనికి పడదన
ప్రక్కవాని మాటలెక్కగొనక
అగ్గిపెట్టెదీసి ఆనందముగ గీచి
చుట్ట కాల్చునతడు చోద్యమొంద

ఆ॥ బస్సు రైలులోన పట్టశక్యముగాని
పరిమజూపి యతడు పట్టుబట్టి
పొగను వదలుచుండు పొగబండివోలెను
ఎదుటివాని బాధ నెఱుగకుండ

ఆ॥ బస్సునిండ ప్రజలు బందీలుగానిల్చి
ఊపిరాడకుండ నున్నతటిని
చుట్ట బీడి పొగలు ముట్టడివేయగ
చెప్పనలవిగాని చింతగలుగు

ఆ॥ బస్సులోని సీటు పదిలంబుగానుండ
గుడ్డముక్కలచట గురుతుబెట్టి
శ్రమపడి జొరబడు సాటి సీనయ్యకు
సీటు దక్కదింక చిత్రమద్ది

ఆ॥ నోరువాయిలేని నారయ్య లామీద
నిలబడి పయనింప కలతజెందు
కడుపులోని నీళ్ళుకదలక ఎక్కిన
తిరుపతయ్య పనికి తిరుగులేదు

ఆ॥ పొగనుపీల్చ నొకడు సిగరెట్టు వెలిగించి
నిప్పురవ్వలిడగ ముప్పుగలుగు
లెక్కసేయడతడు వెక్కసంబుగ త్రాగి
ముప్పుగూర్చునట్టి తప్పుపనికి

ఆ॥ త్రాగుబోతుతనము తగవుకు మూలము
మత్తుమందువలన మనసు చెడును
చెడును గుర్తెఱింగి విడువరు దుష్క్రియన్
వివరమెఱుగనట్టి వింత ప్రజలు

ఆ॥ రాయితీలమీద రైలు ప్రయాణము
సల్పునట్టి గుంపు సాగివచ్చి
రైలుబండి ఎంత రద్దీగనున్నను
పేక మొదలుబెట్టు బిడియపడక

ఆ॥ పేక చదరమందు దూకిన రసికులు
ఒకనివెంట నొకడు వికలమతిని
దమ్ము మొదలుపెట్టి దుమ్ముదుమ్ముగ త్రాగి
విడుచుచుండు పొగను గడుసుగాను

ఆ॥ "క్లాసుఫోరు"వారు కలవారితోసాటి
గ్యాంగు పనులమీద కదలివచ్చి
సొంతబండివోలె పంతాలమీదను
చుట్ట బీడి కాల్చు చోద్యమొంద

ఆ॥ తనకు వచ్చునట్టి ధననిధి ఎంతయో
తలపకుండ తాను త్రాగివేయ
ఖర్చుచేయుచుండు గలగల పైకంబు
ముందుచూపులేక మూర్ఖుడయ్యె

ఆ॥ విధులు నిధులు మరచి వింతగా చరియించు
బాబులంత తుదకు బాధపడుచు
ఆసుపత్రిలోన నడుగుమోపినపుడు
కానిపించు దాని కలత మిగుల

ఆ॥ ఆడుదానిమీద ఆశలుడిగిపోయి
పొగను పీల్చునట్టి పురుషులందు
'సెక్సు'మీద పెద్దశిక్షగా పనిచేయు
ధూమపానమనెడి ధూర్తగుణము

ఆ॥ చాపుకెవడు నేడు జంకుటలేదాయె
ఎంత సాహసంబ దెంత వింత
ఆత్మహత్యలనిన నవలీలగాసల్పు
మూఢజాతి కెటుల బోధపడును

ఆ॥ చిన్నతగవులైన చిలిపిగా చెలరేగి
కత్తి చేతబట్టి కాలుదువ్వ
చట్టమన్న నిపుడు చవటగా తేల్చేసి
విఱ్ఱవీగుచుండె వెఱ్ఱిజనము

ఆ॥ ఘనుడు హీనుడైన కత్తితోడ పొడిచి
తీయగలడు తలను తిరుగులేక
అతకగలడ? దాని నారునూరైనను
ఎందుకంత నీచ మెందువలన

ఆ॥ జననమందు తల్లి నవమాసములుమోసి
పెంచి పెద్దజేయు ప్రేమతోడ
చిన్నతగవువలన ఎన్నియో ప్రాణాలు
గాలిలోనకలసి తేలుచుండె

ఆ॥ గుడికి వెళ్ళునట్టి కొంగభక్తులుకూడ
చుట్టకాల్చి పీల్చి సొల్లుకార్చి
ఎరుగనట్లు గుడిలో నెంతయో భక్తితో
స్వామి సేవసల్పి సాగివచ్చు

ఆ॥ ప్రక్కనున్నవాడు భరియింప శక్యంబు
కాని కంపుకెంతొ కలతజెంది
తప్పుకొనును తాను తప్పకనామీద
ప్రభువు గుడిలోన బాధపడుచు

ఆ॥ ప్రభువు యేసుక్రీస్తు పరిశుద్ధ సంఘాన
ధూమపాన మద్య ధూర్తపనులు
సల్పరాదు ప్రజలు సద్గతి పొందగా
దైవయాజ్ఞ మీరి ధరణియందు

ఆ॥ కడుపునిండునటుల కమ్మని వంటలు
ఆరగించి పిదప తీరుబడిగ
కంపుకొట్టునట్టి కడు చెడ్డదైనట్టి
చుట్ట కాల్చునతడు పొట్టచెఱుప

ఆ॥ కఠినమైన వ్రతము కరముగా సల్పగా
పలు మతములవారు పలువిధముల
మిన్నగాను పెంచు మీసాలు గడ్డాలు
మ్రొక్కుబడిగ నిచ్చి మోక్షమొంద

ఆ॥ వ్రతము పూనినట్టి వరపుత్రులామీద
చుట్ట బీడి విడిచిపెట్టబోరు
పొగను త్రాగి బొచ్చుపొగ చూరబెట్టియు
పరమ భక్తితోడ ప్రభువుకిచ్చు

ఆ॥ ఇల్లు ఒళ్లు గుల్ల ఝల్లంత కంపుతో
వెగటు కలుగజేయు విసుగుజెంద
అట్టి కంపుతోడ ఆత్మీయదేవుని
స్మరణజేయు టెంతసవ్యమౌను

ఆ॥ మనుజ హృదయమొక్క మహనీయ గుడియని
వేదఘోషయుండ వినడు నరుడు
ఆచరింపలేని ఆ నీచభక్తేల?
తలపబోరు మనసు మలపబోరు

ఆ॥ నీదు దేహమంత నిర్మలంబుగనున్న
బ్రతుకుదినము లెన్నొ బడయుగలవు
మనసు దేహమంత మలినంబుగానున్న
మోక్ష మెట్లుదక్కు మూర్ఖ ప్రజకు

ఆ॥ ధూమపానమన్న దూరంబుగానుండు
కొంతమంది సిక్కు వింతజూడు
బొచ్చుపెంచి భక్తి హెచ్చుగాచాటించి
జాతి హింసయనిన జంకరేల?

ఆ॥ మతము మనకు నొక్క మంచిమార్గంబని
సర్వు లెరిగినట్టి సత్యమిద్ది
ఇరుగుపొరుగుమీద తరచుగా చెలరేగు
ధూర్తతనము మిగుల దుష్టగుణము

ఆ॥ బొచ్చు పెంచుకొనిన పుట్టునా పరపతి
దైవసముఖమందు తంతుగాని
ఆత్మశుద్ధిమాట నావంత తలపక
కపట జీవితంబు గడుపరాదు

ఆ॥ ఆత్మశుద్ధి గలిగి ఆత్మీయభక్తితో
జీవితంబు గడుప చింతలేదు
లోన యొకటియుండి పైకి నొకటిబల్కు
బ్రతుకు నెఱపుకొనిన ఫలముగలద?

ఆ॥ రాజ్యకాంక్షతోడ రాక్షసప్రవృత్తి
వేయితలలువేసి వెఱ్ఱిగాను
నేరమెఱుగనట్టి నీతిపరులబట్టి
హతముజేయునట్టి మతము మతమ?

ఆ॥ చిన్నచితకయనక పెద్దగా వధియింప
చట్టమొప్పుకొనున చవటపనికి
ధర్మయుద్ధమీవు దర్జాగసల్పిన
జయము పొందగలవు జంకులేక

ఆ॥ అయినవారలనక నత్యధికులనక
వరుసబెట్టిచంప విరసమాయె
హత్యవలన భువిని నబ్బునా రాజ్యంబు
నీతిదప్పినట్టి దుష్టప్రజకు

ఆ॥ ఎంత కడుపుకోత ఎంత దుర్గతిగల్గె
దేశ ప్రజకు మిగుల ఆశలుడిగె
మతముపేర నిట్టి మారణహోమంబు
సృష్టిజేయు డెంతచింత మనకు

ఆ॥ బంగ్లదేశ ప్రజల బాగుగోరి జనని
వీరనారివోలె పోరి జయము
కూర్చిపెట్టియుండ కుచితులెల్ల
శాంతి దూరపరచి వంతగూర్చె

ఆ॥ ధూమపానమొక్క ధూర్త లక్షణమాయె
మతము మనకు నొక్క మత్తుమందు
ఒకటి యిల్లుగుల్ల ఒకటి మనసుగుల్ల
చేసిపెట్టి తుదకు చింతగూర్చు

ఆ॥ నివురుగప్పినట్టి నిప్పులా మెలిగెడి
మత్తుమందు మనకు మతమునేడు
సత్యమరసిసాగు సాత్త్విక హృదయాన
సుఖము బడయగలవు నిఖిలమందు

ఆ॥ అధిక లాభములకు నాటపట్టుగనున్న
ఈ పొగాకు పంటనెంతగానొ
వృద్ధిచేసినారు పెద్దగా ప్రభువులు
ప్రజల ప్రాణములను పణముబెట్టి

ఆ॥ డబ్బుకున్న విలువ లవలేశమైనను
ప్రాణియెడలలేదు పాపమేమొ
పట్టుబట్టి వారు పంటనిషేధింప
ఎండగట్టవచ్చు గుండెజబ్బు

ఆ॥ దుష్టపాలకులిట దులిపివేయగ గల్ల
ముష్టిఎత్తినారు పుష్టిలేక
దేశపాలనమున ధీశక్తి చూపించి
ఏలుచుండెనేడు మేలుగాను

ఆ॥ కొల్లగొట్టినారు గుట్టుగా ధనమును
వెనుకముందులేక భీతివీడి
తలను గొఱిగివారు తాకట్టుపెట్టిరి
దేశ కాంచనంబు దిక్కులేక

ఆ॥ మనసుమారి మనము మనుగడసాగింప
ప్రగతి బడయగలము బ్రతుకునందు
దుర్వ్యసనములన్ని దూరపరచుకొన్న
పొందగలము ముక్తి ముందుమనము

ఆ॥ ఆచరింతురెన్నొ అడ్డగోలుపనులు
భక్తిపరులమనుచు వ్రజకుచాట
చిత్తశుద్ధిలేని శివపూజలేలని
విప్పిచెప్పె మనకు వేమనెపుడొ।

ఆ॥ తోటివానికింత సాయపడని నీదు
స్వార్థపరతవలన సంఘమునకు
సాయమేమిగలుగు చక్కగా యోచింపు
చిత్తశుద్ధితోడ సేమమరసి

ఆ॥ రాజ్యమేలునట్టి రాజ్యాధికారులు
విర్రవీగి మొదట బిర్రబిగిసి
తుదకు కళ్ళుతెరచి తుదికంట దునుమాడ
కంకణమునుగట్టి కదలియుండె

ఆ॥ గద్దెనెక్క వారు గడబిడల్ సల్పియు
రద్దుజేసె రైతు పద్ధులన్ని
ఏడువేలకోటు లీరీతి హరియింప
దిక్కుతోచలేదు దేశప్రజకు

ఆ॥ రాయితీలమీద రాజ్యాలనేలంగ
ఆశజెందియుండ నల్పులిట్లు
పరులు నవ్వుచుండె పడరానిపాట్లకు
స్వార్ధమెంత చెబుపు సల్పుచుండె

ఆ॥ ప్రజలమీద బరువు పలువిధంబులమోపి
ఋణము తీర్చుచుండె ననుదినంబు
చిన్నపెద్ద ఋణము లెన్నియున్ననుగాని
నీతిగలిగినట్టి నేతలిపుడు

ఆ॥ అధికధరలు మనల నణగద్రొక్కుచునుండ
మత్తుమందుమాను మనుజులేరి?
పట్టుదలగ ఖర్చు పలువిధంబులనాపి
దేశప్రజలయొక్క వాసిబెంచు

ఆ॥ ఉన్నవాని బ్రతుకు ఉన్నతముగనుండె
లేనివారి బ్రతుకు లేమితోడ
క్రుంగియుండె నేడు కూకటివ్రేళ్ళతో
దారితెన్నులేక ధరణియందు

ఆ॥ గుక్కదిరుగకుండ వెక్కసంబుగ త్రాగి
మరచినారు పొగను మంచివారు
ఎనుబదేళ్ళునిండి ఎంతయోగొప్పగా
తిరుగుచుండె నేడు ధరణిమీద

ఆ॥ మాని నిదురబోవ మనసురాదనిచెప్ప
మానవాత్ములార! మహితులార!
పట్టుబట్టి దాని పారదోలకయున్న
ఆయువెంతొ క్రుంగు నవనిమీద

ఆ॥ అందగాడెకాడు అందగత్తెయెగాదు
దాని రుచినిమరిగి తనివిదీర
త్రాగిచెడనట్టి ధన్యులేలేరాయె
ఎంతచిత్రమిద్ది ఎంతవింత

ఆ॥ తనదు కంపుజూడ తనకు నెంతొ యింపు
పరులకంపు తనకు బహుగచెడుగు
అట్టిరీతి నేడు చుట్టుత్రాగెడివారు
సత్యమెరుగకుండ సంచరించు

ఆ॥ మమతబెంచి మనము మంచిగాసాగిన
బ్రతుకగలము నేడు పరువుగాను
ఐక్యమత్యమీడి అల్లరిపెంచిన
పుట్టగతులు నాస్తి పుడమియందు

ఆ॥ రాజుమొదలు బంటు రవణప్పయైనను
దాని బారిపడిన తరలలేడు
సకలమానవాళి సామంతులేగాదు
బలిసియున్న గొప్పభక్తులంత

ఆ॥ తెలుపునలుపువంటి తేడాలులేకుండ
అందరింటనలరు నధికురాలు
మలయమారుతంపు మహనీయ వాయువున్
మార్చివేయునట్టి మంత్రగత్తె

ఆ॥ గురువులకు గురువు గురజాడ యానాడు
చుట్టకాల్చుటెంతొ సుందరముగ
చెప్పియుండె తాను చీదరచెందక
దాని కీడుమరచి ధరణీయందు

ఆ॥ ప్రజల కిష్టమైన ఆకుపొగాకును
అమృతమని తలచి ఆశపడును
చెడుగు దానిలోన చేరియుండుటచేత
ముట్టి చెడనునేను ముష్టియాకు

ఆ॥ మందురీతినెపుడు మద్యంబు సేవింప
మేలుకలుగవచ్చు వాలుగాను
గుండె చెఱచునట్టి గ్రుడ్డిపొగాకును
త్రాగిచెడుట మనకు తగదుసుమ్మి

ఆ॥ చుట్టబీడికాల్చు సోదరబృందమా।
మీరుకూడ మాని మేలుబొంద
వేడుచుంటి మిమ్ము వినయంబుగా నేను
శతమునిండి బ్రతుక చల్లగాను

ఆ॥ చెడునుగూర్చి నేను చెప్పితిసత్యంబు
దేశప్రజలయొక్క వాసిబెరుగ
కలుగగలదు ఫలము కడు పేదవర్గాన
చుట్ట బీడి ఆకుముట్టకున్న

## వెలువడిన గ్రంథములు - 17

### అమ్మకమునకు సిద్ధముగా నున్నవి

| | | | |
|---|---|---|---|
| 1] | యోసేపు చరిత్ర | నాటకము | 10-00 |
| 2] | పితృప్రేమ | | 8-00 |
| 3] | తలవని పెళ్ళి | (సాంఘిక నాటకము) | 12-00 |
| 4] | ముక్తిదాత | (క్రీస్తు జీవితము) | 8-00 |
| 5] | లాల్‌బహుదూర్‌శాస్త్రిగారి జీవితచరిత్ర | | 6-00 |

### అముద్రిత గ్రంథములు

1) ఆంధ్రరత్నము [నవల]
2) తీర్పు [సాంఘిక నాటకము]
3) నేటి న్యాయము [నాటిక]
4) ఉత్తమ దేశభక్తుడు ,,
5) బడిపంతులు ,,
6) ఎస్తా చరిత్ర ,,
7) భక్త ఎలీషా ,,
8) మన రాజ్యాంగము [బుర్రకథ]
9) ప్రశంసలు-విమర్శలు [పద్యకావ్యము]
10) అవినీతి [పద్యకావ్యము]
11) మేలుకొలుపు [పద్యకావ్యము]

ప్రతులకు :-

పిడపర్తి ఎజ్రాకవి
బోసునగర్, తెనాలి-522 201.